## కవికోకిల కావ్యావళి

వసంతము

గ్రీష్మము

ప్రణయార్పణము

బలి

హోలి

చెల్లమాంబ

శ్రీయద్దేపలి వంశ వి
హాయసమణి యైన లక్ష్మయార్యుని సుయశః
కాయము హితరతమతినై
ధ్యేయము గావింతుఁ గృతిపతిత్వంబునకున్

హాలముందాల్చి సమస్తభూజనులుచోద్యంబంద బంగారు పం
టలు పండింతురు 'తెల్గ' లీతెలుఁగురాష్ట్రంబెల్ల శోభిల్లఁగా
కలముందాల్చి రచింతురాంధ్రకవితాకల్యాణి కై సేయు మం
జులవాక్పూనగుళుచ్ఛముల్ నవరసస్ఫూర్తిస్ఫురత్కావ్యముల్

తెలగా సత్కులమందు వాసి గని అద్దేపల్లి వంశంబు శో
భిలె తీరౌ పువ్వుఁదోట చక్కని గులాబీజాతి రీతిన్ జనం
బుల కామోదముఁగూర్పదాల్చినదిసత్పుత్ర ప్రసూనంబులన్
జెలువారం గయిసేసె కైకర పురశ్రీ రమ్యధమ్మిల్లమున్

ఆ వంశంబున బాలభాను డన కొండయ్యాభిధానుండు తా
నావిర్భావమునందె; నాతనికి సుబ్బయ్యాఖ్యు డాత్మోద్భవుం
డై వాసింగనె; వాని పేరిడిన గ్రంథాగార మొక్కండు నే
డా వీటన్ బోలుపారు పౌరజనవిద్యాగంధసంధాయియై

అలఘుతరశీలు రేవురు
గలిగిరి సుతు లతని కతివికస్వరమూర్తుల్
విలసిల్లె విబుధమణి వా
రలలో లక్ష్మయ యశోవిరాజితుఁ డగుచున్

వానికి లక్ష్మికిన్ దగవు బాపిన పుత్రుల గాంచె నాత డా
బాణునికావ్యమున్ తెనుగుబాస రచించి 'కవిత్వవైదుషీ
వేణిక'నా నుతింగను నభిజ్ఞవతంసుని నాగగోపునిన్
హూణసరస్వతీకరజయోన్నతిఁ గాంచిన నాగభాస్కరున్

మతిమంతుండగు లక్ష్మయాఖ్యుడు జగన్మాన్యుండు రౌద్రిన్ దివం
గతుఁడైనన్ పితృదేవమూర్తిని లసత్కావ్యప్రసూనాంకచి
హ్నితుగాఁ జేయఁదదగ్రనందనుడు మన్మిత్రుండు వాంఛింపనీ
కృతికిన్ నాయకుఁ జేసి తద్విభవమున్ గీర్తించితిన్ బ్రీతిమై

పెమ్మరాజు లక్ష్మీపతి
సుభాసు . తొలకరి

# తొలకరి

అర్కతప్తంబౌ మహాబ్ధిమధ్యమునుండి
యాకాశవీధి కంతంత లేచి
యటుప్రాకి యిటుప్రాకి యాశాంతముల దాకి
యంబరం బంతయు నావరించి

పొరలలో బొరలు దొంతరలు దొంతరలునై
నీలనీలంబులై నిలిచి నిలిచి
పశ్చిమ యామ్య దిగ్భాగద్వయంబు మ
ధ్యంబు పెందెరువుగాఁ దరలి తరలి

లోని తేజంబు తళుకు తళుక్కు మనుచు
మెరసి పై బడ దిగ్దిగంతరము లెల్ల
దద్దరిల్లంగ నురిమి యుత్సాహజృంభ
ణమును, నున్నతగగనయానంబు దనర

అడ్డమై నిల్చు సహ్యాద్రిపంక్తుల కల్గి
యూరుపుపై నురుముగా హుంకరించి
పెరిలు పెళ్లను బిడుగుల సహ్యాద్రి
మూర్ధంబు పిండిగా మొత్తిమొత్తి

ఎలగోలు వర్షించి యేకోదకంబుగా
మళయాళమును జలమయముఁ జేసి
పెనుగాలి జత గూడి వినువీధి నడయాడి
యా పర్వతాగ్రంబు లంత దాటి

నీలగిరి శృంగముల మ్రోల నిగిడి పఱచి
ద్రవిడ కర్ణాటకంబులు దాటిపోయి
భరతభూమికి భూషణప్రాయమైన
యాంధ్రరాష్ట్ర మధ్యంబున కరుగుదెంచి.

తొలకరి మేఘముల్ చదలఁదోఁచె, నభస్తరుణీ వినీలకుం
తలములు జీరుకాడెడువిధంబున భూస్థలికిన్ దిగున్ మహో
జ్జ్వలమగు స్వర్గజీవనము; జాల మికేటికి లెమ్ము లెమ్ము నీ
హాలమూధరించి రమ్ము సమయంబరుదెంచె నిదే కృషీవలా!

ఆ హిమాచలము లక్ష్యంబుగా నవె కొన్ని
యరుగుచునుండె నీలాంబుదములు
పూర్వాభిముఖములై పోవుచున్నవి కొన్ని
బ్రహ్మదేశమునకు వార్ధి దాటి

పాయలు పాయలై పరుగెత్తు నొకకొన్ని
తీరుగా నుత్తరదిశకు సాగి
మెలికలు తిరిగి చుట్టలు జుట్టుకొని కొన్ని
దొరలుచున్నవి వసుంధరకు డిగుచు

తరళసౌందర్య లీలావిధాన మొనర
నవ్యమోహావ మగు గగనాంగణమున
సహజ చాంచల్య లలిత స్వాచ్ఛ్యయవిహార
సంభృతంబైన వాయుసంచాలనమున.

కనుచూపుమేర దిగంతమం దవెకొన్ని
పర్వతశ్రేణినా పరిఢవిల్లు
ఆకసంబున నీదులాడు నోడలభంగి
యవె తేలు నొక కొన్ని యంబుదములు

మీదిమీదికిఁ బోయి మిహిరమండలము నా
చ్ఛాదించు నవె కొన్ని జలధరములు
ఆ సూర్యకాంతు లందందు నంచుల వెల్ల
నింగి మధ్యంబున నిలుచు కొన్ని

గగనమునుండి భూమికి దిగుచు కాళ్లు
సాచె నవె కొన్ని యపరదిశాంచలముల
నచట వర్ధిల్లు ధరణీరుహవ్రజంబు
వాన తెలిముసుగునను కప్పంగబడియె.

ఇవె వ్రాలుచున్న వీ యింద్రకీలాఖ్య ధ
రాధరాగ్రమున ధారాధరములు
అవె కొండవీటిపై నవె మంగళాద్రిపై
నల్లని పొగమబ్బు లల్లుకొనియె

అటు పాపికొండలం దిటు కోరుకొండపై
నల్లాడె కొన్ని నీలాంబుదములు
భద్రశైలము సింహపర్వతంబును దాకి
వర్షించె నొక కొన్ని వారిదములు

గ్రీష్మ మది యంతరించెను మృగశిరప్ర
వేశమై యొప్పె నాంధ్ర పృథ్వీతలమున
తప్తమగు భూమి వర్షాన దడిసి యునికి
కమ్మనగు మట్టివాసనల్ కలయబర్వె!

అరుణభూరజము నొయ్యన దాల్చి శోణవా
హిని యయ్యె నల్లదే కృష్ణవేణి
నిండుజీవనమును, నెలజవ్వనము దాల్చె
వృద్ధగౌతమియు విజృంభణమున

కృష్ణరాజ్యము సంస్మరించెడు నోజ యు
ప్పొంగుచున్నది యదే తుంగభద్ర
తిప్పలన్నియు ముంచి తెప్పల దేలించి
యలలతో పెన్న తూగాడుచుండె

నాటవికజృంభణంబున నడ్డమైన
కొండల బగిల్చి యడవుల గూల్చివైచి
యడవి కోయదొరల యింటి యాడుబిడ్డ
యెఱ్ఱకాలువ యత్తింటి కేగసాగ.

కడలి గర్భమునందు కరడుకట్టిన కారు
కటికచీకటిఁ గొంతకాల మలసి
యటునిటు ద్రొక్కి తూగాడెడు కెరటాల
నడకలలో గొన్నినాళ్లు నలిగి

తీర్చి కాసెడు నెండదెబ్బకు గొన్నాళ్లు
యెసరుపొంగును వోలె మసలి మసలి
యెలయించి వినువీధి కెగురవైచెడు గాలి
దేలి దూలుచు కొంతకాల ముండి

ఆకసము నంటియున్న నైల్యంబు నందు
కొన్ని దినములు పైకిరాకుండ కరగి
యిన్ని దిక్కులు కడదాకి యిప్పుడు చూడు
మంబుదంబులు మిన్నంటి యాడ దొడగె.

అనుకొన్నారొకో యెవ్వరైన మునుపి ట్లౌనంచు నా చండశా
సను రాజ్యంబునువోలె మాడ్చినది గ్రీష్మంబింతకాలంబు నా
తనచైతన్యము నవ్యధర్మవిజయోత్సాహంబు శోభిల్లు చ
ల్లని వర్షాగమముం గనుంగొనుము కాలంబెంతలో మారెనో !

పాయల్ పాయలుగాఁగ నల్లనై నభోభాగమునం దేలి బల్
తోయంబుల్ గురిపించుచున్ బ్రబలసంతోషంబునిండార స్వే
చ్ఛాయానంబున నత్యుదాత్తగతి సంచారంబుఁగావించు తా
మీయానందము నెందుదాచుకొనెనో యిందాక నీమేఘముల్

మెరసిపోవుచునుండె మిరుమిట్లు కొల్పుచు
నీలజీమూతముల్ చీలిపోవ
ఉరిమి పైబడుచుండె నుర్వీతలం బెల్ల
కదలొంది యదరున బెదరిపోవ

పెఠిలి బ్రేలుచునుండె పిడుగులు రాలగా
పర్వతాగ్రంబులే పగిలిపోవ
నాదివేయుచునుండె నొకగడ్డిపోచగా
నే మూలకో లోక మెగిరిపోవ

ఏది యీ శక్తి? యీ మహోన్మాదలీల
కర్త యెయ్యది? యేది లక్ష్యంబు? చెప్పుమ
కృతయుగము నాటిపురుషుడ వీవు తండ్రి
లోకము పునాదులే కదలొందుచుండె.

ఆటవిడుపున నలరు విద్యార్థిగణము
లటుల విడివడి చెలరేగి యాడుచున్న
వవిగో! యాకాశవీధియం దంబుదములు
లాస్య కేళీకళా మహోల్లాస మొలయ

ఇది మహావిప్లవంబు మహేంద్రజాల
మిది జగన్నాటకంబున కెల్ల నాంది
పులకరించెను విశ్వ మపూర్వఫణితి
తొలకరించెను కనుము రోదోంతరంబు.

మొత్తములై పయోదములు ప్రోయతటిల్లతికల్ నటింప నృ
త్యోత్తుగ దిగ్దిగంతరమహీవలయంబు చలించులీల ముం
చెత్తు సువృష్టితోడ నవజీవన మెల్లెడ మేల్కొనంగ లో
కోత్తరమేఘవిప్లవమహోద్యమ మియ్యది హాయిగొల్పెడిన్

అవ్యయదివ్యభావమకరాలయజీవన మార గ్రోలి, యీ
దివ్యకళావికాస సముదీర్ణత మేదిని దాండవింపగా
శ్రావ్యగభీరనాదమధురంబుగ మేఘము సంచరించుచో
నవ్యయుగోదయంబు గగనంబునఁదోచు గదయ్య కర్షకా!

నీలమేఘ దర్శనమున నెమ్మివోలె
నాడుచున్నది పురి విప్పి యఖిలజగము
పైరుపచ్చలతో పుష్పపల్లవముల
తోడ పలురంగు లొలయు వస్తువులతోడ.

ఆశాతాండవకేళియో, నవయుగ ప్రారంభలీలారసా
వేశక్రీడనమో, జగజ్జనమనోఽభీష్టాసమావాప్తియో
యీశిల్పక్రియ లీ రసాభినయ మీశృంగార వారాశిసీ
చీశోభల్ మినుముట్టుచున్నయవి వీక్షింపందగున్ కర్షకా!

శాసనముల్ నిషేధములు శాస్త్రములాదిగ కల్గుబంధముల్
గోసి నటించు కృష్ణుడును గోపికలుం బలె రంగు లేకమై
రాసము లాడుచుండిన యరాచకమెంతయురమ్యమై మహో
ల్లాసముగూర్చుచున్నది యిలాతలముఁ గయి సేయుకూర్పులన్

నలుపో యెరుపో పసపో
కలవర్ణము లెల్ల కలియగలిపి చదలపై
జిలికిన నొలికిన నైనను
చెలువమె దళుకొత్తె రసము చిప్పిల నదిరా!

హారతు లెత్తుచున్ జగమునందలి యందములెల్ల వచ్చి కై
వారము సేయఁగా మహితవైభవముల్ వెలయించు రాజ్ఞియై
స్వైరపహారధీర యగు స్వర్గకుమారి; క్షణంబులోన బం
గారముగాఁగ మార్చెను జగంబఖిలంబుఁ గృషీవలాగ్రణీ!

అపరసముద్రవీచికల నస్తమయంబును జెందె రాజు తూ
రుపు తొలిప్రొద్దుచాటికల గ్రొంజిగిసోయగమంటుకొన్న ద
ట్టపు జలదాంతరేఖల బెడంగు మనంబు హరింపజొచ్చె వే
లుపుచెలువంబు భూమి ననలొత్తెను నిత్తటి గర్షకోత్తమా!

పలుకుం దేనియ తీగగా నిగుడ భూపాలధ్వనిన్ మేలుకో
తెలవారెం గనుమార్యపుత్ర! వెస నేతెమ్మింక లెమ్మంచు స
త్కలకంఠంబుల పాడుచుండిరదె యాకర్ణింపు మీవిట్టి మే
ల్కొలుపుం బాటను పాడిచూపిన రసజ్ఞుం డేమహాత్ముండొకో!

లలితవినీలమేఘశకలంబులపై మృదులారుణోదయో
జ్జ్వలనవకాంతిశోభలు విభాసిల లేత గులాబిరేకులై
మలయుగ వానిదేల్చు సుకుమారకుమారసమీరవీచికా
విలసన మందగించె వినువీధులఁ బూర్వదిశాంచలంబునన్

గొనబగు డాగురేకు తళుకుల్ చణుకుల్ దొళుకాడ నార వి
చ్చిన తొలిసంజచెల్వ మొకచిత్తరువై, తెరవోలె వ్రేలగ
ట్టిన యను వొప్ప ముందరనటించెడు నచ్చరలేమపోయగం.
బెనయగజాలు మందపవనేరితకోమల మేఘమాలికల్

పూచిన మోదుగుల్ కరగిపోసిన లోహము లంబరస్థలిన్
దాచిన రత్నమాలిక లుదాత్తరసాన్విత చిత్రసత్కళా
రోచులు సాంధ్యరాగమును గోదసి నిండె నపూర్వకౌతుక
శ్రీ చెలువార బ్రాతరుషసీసమయంబున దూర్పుదిక్కునన్

ఒకయెడమంకెనల్ మరియునొక్కెడ లేత గులాబిపూవు లిం
కొకదరి నెఱ్ఱికల్వలు మరొక్క దెసన్ కరవీరమంజరుల్
రకరకముల్ ప్రసూననికరంబు లివన్నియు నొక్కమారుగా
వికసన మంది యొప్పె నుడువీధి బ్రభాతపు సందెచాయలన్

తెరలు తెరల్ పొరల్ పొరలు తీరిచి పేరిచి పింజపింజగా
బరచిన సన్నపట్టువలిపంబులువోలిన మేఘమాల లం
బరమున వ్రేల వానిపయి వ్రాలెడు నందపుసందెవన్నియల్
కెరటములల్లుచున్ తురగలించుచునున్నవి లేమెరుంగులన్

చింతయా లక్కురం గంతంత కెగబ్రాకి
కరగి తేరినది చెంగావిచాయ
చుట్టు చెంగావిలో సుడివడు నొకకొంత
లలితమై మలయు గులాబిరంగు

తళతళ లంతకంతకు మీరి జిగి దేరి
నారింజవన్నె గానంగనయ్యె
అది వన్నె మీరుచో తుద కెఱ్ఱడాలు
కడాని నిగ్గులలో నడంగిపోయె.

నీలిమయె నిల్చె వీని యన్నింటివెనుక
నంతకంతకు బదు నెక్కునట్టి కత్తి
యంచువోలెను గ్రొందళుకారుచున్న
వెలుగువెల్లువ నివి యెల్ల మునిగిపోయె.

రంగులలోన రంగు లొకరంగున వేయితెరంగులై దిశా
ప్రాంగణసీమ లేమెరుగుటద్దకముల్ దడియారునట్లుగా
చెంగులు వ్రేల నారవయిచెన్ సరిగంచులపట్టుపుట్ట మా
'రంగులరాణి' రాణయొనరన్ కనుమెంతటి సిద్ధహస్తయో!

స్వచ్ఛందాహృతచిత్రవర్ణయగుచున్ సౌందర్యసామ్రాజ్యమే
కచ్ఛత్రంబుగ నేలుచున్నయది; యజ్ఞానాభిధానాంధకా
రాచ్ఛాదంబు దొలంగజేసి విపులార్యావర్త మాత్మీయదే
హచ్ఛాయావృతమై వినూతనశుభోద్యత్కాంతి పొల్పారగన్

ఆర్యజనలోక హృదయవిహాయసమున
నూతన యుగోదయారుణజ్యోతి వెలుగ
నమృతజీవనము పయోధరముల దొలుక
దాండవము సల్పుచుండె సంధ్యాకుమారి !

అవి హోమకుండానలారుణజ్వాలలా
యలముకొన్నవి ప్రాగ్దిశాంతరమున
అవి ధూమరాజీ విహారంబులా కారు
గ్రమ్ముకొన్నవి మేఘగణములట్లు

అది యజ్ఞశాలయా, యాసేతు హిమవన్న
గాంతరస్థంబైన యార్యభూమి
వేల్చుచునుండిరా వేదోక్తవిధి హవ్య
కోటి ముప్పదిమూడుకోట్లజనులు

అవల ప్రభవింపబోలు జ్ఞానార్కబింబ
ము మ్మహాయజ్ఞ ఫలముగా నేపు మిగిలి
స్వర్గధామంబునుండి విశ్వప్రపంచ
శాంతిరమ డిగివచ్చు నిశ్చయము భువికి.

ఈ యుషస్సుందరియే కదా దివ్య
సౌందర్యంబు వర్షించు ధరణిపైన
ఈ స్వర్గనందనయే కదా ప్రకటించు
దివిఁ బుట్టు కాంతిసందేశములను

ఈ కళారసలోలయే కదా పలువింత
నగిషీపనులు చూపు గగనసీమ
ఈ జగన్మోహినియే కదా యమృతంబు
పంచిపెట్టును కళోపాసకులకు

ఈ మహాగాయనీమణియేకదా త
లంప విశ్వగీతంబు పల్లవి గ్రహించి
పాడుకొను, మానిహృదయవిపంచి యందు
వేదగాంధర్వకృతు లాలపించుచుండు.

మనుగాలి యలలె సోకిన గందిపోవునో
సుకుమారమూర్తి యీ సుమశరీర
పసలారు నెమ్మేని మిసిమిపై మసి పూసి
నటు లౌనొ మొయిళుల నలుపుడాలు

కసుగందునో యేమొ పసిమిలేయెండకే
యెండకన్నెరుగని యీ లతాంగి
కరగి కలియునేమొ విరిసి విరియు నింగి
నీలాల చాలులోఁ దేలి సోలి

ఆగమాంతశిరోవర్తియగు ముకుందు
చరణతలములఁ జెలువారు నరుణిమ యయి
కాంతి దళుకొత్తు నా యుషఃకపులనేత్ర
యీ ఘనీభవించిన భూమి కెటుల డిగ్గు!

ఆ యరుణరాగ మంటినదోయి యార్య
భూతలమునందు ప్రత్యూషమునను గూడ
క్రమతరమైన యా యుషః కాంతులందు
భావిభారతలక్ష్మి తాఁ బ్రతిఫలించు

అంటియు నంటికోక చెలువారెడు నద్దకముల్ సెలంగ నీ
మంటికి మింటి కద్దు సుకుమారపు శిల్పములెల్లఁ బైరులై
పంటవలంతిపై నభముపైఁ బలువన్నెల, నెంత వింతలో
పంటలు పండిపోయినవి బాపురె! కోసికొనంగ రావొకో!

అది సకలావనీతల జనావనపావనమైన కాంతియై
యుదయమునందుచున్నదదిగో మృదులారుణనవ్యశోభ పూ
ర్వదిశ దలిర్చి రత్నముల రాసులు నీపయి గ్రుమ్మరించుచు
న్నదికనుమోయి నీవు యుగనాథుడవయ్య కృషీవలోత్తమా!

ముప్పదిమూడుకోట్ల దళముల్ చెలువారెడు పద్మరాజమై
యొప్పిన భారతావని నవోదయశోణ సువర్ణవల్లరుల్
కప్పిన యంత నూతనవికాస మెలర్పగ రేకు లన్నియున్
విప్పుచునున్న మేటిరమణీయతఁ గాంచఁగదయ్య కర్షకా!

తొలకరినాళ్ల తూర్పుదెసఁదోఁచిన యాపసిపాపప్రొద్దులేఁ
జెలువము భూమిప్రాలి యొకచేతను మేఁడివహించి దుక్కిటె
ద్దుల నదలించుచున్ పుడమిదున్నెడు నీ కృషి కాత్మమెచ్చి నీ
తలఁగల తెల్లపాగ మడతన్ పురి విచ్చినజాడ దోఁచెడిన్

తొ ల క రి

అవభృథమజ్జనంబన శ్రమాంబుకణంబులుజాలువారుమూ
ర్తి విలసనంబుతో వసుమతీసముపాసనతోడ నిత్యయా
గవిధి భజింపుచుండెడు జగద్ధితబుద్ధి వహించు సోమయా
జి వనఁ దనర్చి భాగవత జీవనమున్ వెలయింతు కర్షకా !

నా హృదయావనీతలమునన్ వికసించిన భావపుష్పసం
దోహము దండగ్రుచ్చి వయితున్నఋతన్ రసభావవల్లరీ
దోహదధూపధూమములు తోయదపంక్తులుసాక్షిగా మనో
మోహను డైన త్యాగమయమూర్తికి కర్షకచక్రవర్తికిన్

అల్లన భావరాట్నము నొయారముగా వెసత్రిప్పిత్రిప్పి యీ
తెల్లని మేఘపుం గొనల దీయుదు దారము లీ నవీనరా
గోల్లసనంబుతోడుగ నయోక్తులు వస్త్రము లల్లియుల్లి నా
యుల్లము కొల్లలాడు హలికోత్తముముఖ్యుని సత్కరించెదన్

నల్లనివాడు మూపుపయి నాగలిమోకులు దాల్చువాడు దా
పల్లెలలో పొలమ్ముల నివాసము నిత్యముసేయువాడు ఈ
నల్లనిమన్ను దున్నుచు జనంబుల నెల్లర బ్రోచు యోగిరా
ట్టల్లజు డా కృషీవలుడు తా వెలయున్ గలకాల మిద్ధరన్

వికసనమందుచున్న యరవిందమొనా జను ధాత్రిపై జగ
త్ప్రకృతి నిగూఢభావభరభంగిమముల్ వెలయించు చిత్రనా
ట్యకలన చూపుచున్నది విహాయసమున్ భువియున్ వెలుంగగా
నొకతొలిసంజ తా బాడమెనో కనుమోయి కృషీవలాగ్రణీ!

పరమధ్యానసమాధినిష్ఠ వెలయన్ బంచాగ్నిమధ్యంబునన్
దిరమైనిల్చి జపించె, నీ జనని పృథ్వీదేవి, యుద్దండభా
స్కరదేవున్ నడియెండకాలమున నీ చైతన్య నవ్యోదయ
స్థిర సౌభాగ్యము నీకు గూర్ప, నది సిద్ధిం గాంచె నీ నాటికిన్

మారును సర్వమున్ ప్రకృతి మార్పులరాశి యటౌట దానిలో
మారనివార లెందుకును మార రనుక్షణభిన్నభిన్న శో
భారమణీయముల్ ప్రకృతిభావము, లందలి యర్థ మెంచు సం
స్కారులు, కాలచిత్రఫలకంబున గాంతు రనంతసత్యమున్

రంగులసీమ యీ ప్రకృతిరాజ్యము సర్వము దీని గన్నులా
రం గని హాయి నొందుచు కరంగుము, ని కిది దైవదత్తమే
రంగును లేని నిర్గుణ నిరంజన తత్త్వములో కృషీవలా !
నింగియు లేని సీమ లటు నిచ్చిన లెవ్వడు సిల్పజాలునో !

ఏతరినైన సందియ మొకించుకయున్ గనబోక కాశ్యపీ
మాతృపదారవిందము లమాయికభక్తి భజించి, భూజన
ప్రీతి యొనర్చు శీలమున బేర్చుచు ధన్యత గాంచుచున్న యో
పూతకృషీవలా!హృదయపూర్వకవందనముల్ గ్రహింపుమా!

నీ వొక కర్మయోగివి గణింప, త్వదాశ్రమజీవకోటులా
గోవృషభాది జంతువులగూర్చి కృషిం బచరించి, సర్వలో
కావన కర్మయోగరతి గ్రాలెడు నీ మహనీయతల్ మదిన్
నీ వెఱుగంగజాల వవనీరమణీ ప్రియపుత్రరత్నమా !

నాగలి నీవు చేగొననినాడు సమస్తము నాటకట్టు భూ
భాగమునందు పౌరుషము పల్కులు వేయును నేల చెప్ప నీ
త్యాగగుణంబె సర్వవసుధాప్రజ కారయ పట్టుగొమ్మ నీ
నాగలిచాలు వెంబడి సనాతనజీవితరేఖ ప్రాకెడిన్

జనకుడ వీవు నీ హలము చాలున నుద్భవమందు సీత భూ
జనములపాలి లక్ష్మి, మనుజాశననాశన హేతుభూతదే
వుని సహధర్మచారిణియు, భుక్తియు ముక్తియు నిచ్చుతల్లి, వం
చిన తలయెత్తవింతకుఁ గృషీవల! యెంతయమాయకుండవో!

అదిగో చూడుము, రాతిలోపలి యహల్యాదేవి శ్రీరామ స
త్పదరాజీవపరాగ మింత తనకుం బ్రాపించునంతన్ నవా
భ్యుదయస్ఫూర్తివహించిమించినగతిన్ పుణ్యాత్మ! నీపాదముల్
కదియన్ వచ్చిన భూమి నూతనకళాలాలిత్య ముప్పొంగెడిన్!

కాలము మారిపోయినది కర్షక! యెప్పటియట్ల యింక నీ
కేల భయంబు నంద? తల యెత్తుము; చూడుము నేత్రపర్వమై
నాలుగుదిక్కులన్ మొలచు నవ్యవికాసము, కేలుమోడ్చియీ
నేలయె, నా యనుంగు జననీమణి యంచు నమస్కరింపుమా!

ఆ సతి మేలిదీవనల నందిన ధన్యుడ వన్న యాత్మవి
శ్వాసము నీకు గల్గునెడ స్వర్గము నీయది, భూమి నీది, నీ
దే సుమి సర్వవైభవము దేవుడ వీవ, నినున్ జయింప దే
వాసురు లేకమైన వశమానె? తలంపుము కర్షకాగ్రణీ!

కృషికమిత్రమ! చల్లని మృగశిరప్ర
వేశసుముహూర్త మదె; వినువీధి నీలి
జిలుగు మొయిళుల మేల్కట్లు జీరువారె
రోహిణీరౌద్రవహ్ని తిరోహితముగ

అది యొక పెండ్లిపందిరి దిగంతములన్ జెలువారె నీలనీ
రద శుభదుందుభిధ్వనులు శ్రావ్యములై; యమరేంద్రవైభవా
స్పద మగు ఠీవితో తరలివచ్చిరి పెండ్లికి, భారతీయులన్
త్రిదశులు వియ్యమందెవ రదే కనుగొమ్ము నభంబు సందడుల్

వసుధకు దొడ్డిచాయలను వాకిలి వైపున పెండ్లిపందిరుల్
ముసుగులుకప్ప క్రొత్తతమముల్ గదిసెన్ గృహమందు పెండ్లిప
న్నెసిరుల గుమ్మరించు నెఱసీటుల నూడుపు బేరటాండ్రు దా
రసిలి రొకళ్లొకళ్లు మొయిరాపులు చిన్నగవుల్ సెలంగగాన్

పల్లకి పైకి నెత్తిరదె పశ్చిమదిగ్వలయాంత మింద్రచా
పోల్లసనంబుతో మెరయుచున్నది, వియ్యమువారి రాక వి
ద్యుల్లతికాప్రదీపికలతో వెనుసందడిగా జెలంగె దా
నెల్లియు లగ్న మింత తడ వేటికి? నీ వెదురేగు మిత్రజిన్

రంగుల కోకలుం జిలుగురైకలు, కొప్పులలో తురాయి పూ
లుం గొమరారగా పులుగులుంబలె బారులు దీరి చేలలో
వంగిన యూడ్పుచేడియల పాటలకీ జగమెల్ల పుల్కరిం
చెం గనుమోయి! పచ్చనగు జీవకళల్ విలసిల్ల నెల్లెడన్

పచ్చని యద్దకంబు పనివానితనంబు వెలార్చుచుండె లే
బచ్చిక నేలపై నొక తివాచిని విప్పినయట్లు దానిపై
విచ్చిన గడ్డిపూలు పలు వింత తెరంగుల కత్తిరింపులై
యచ్చరతీగబోడుల యొయారపు నట్టువ లట్లు యూగెడిన్

చరమదిక్కున మూగు జలదాళి వినువీధి
దరలించి తూర్పుగా తరిమి తరిమి
తరులజొంపంబుల తల లొక్కప్రక్కకు
వసుధాతలముదాక వంచి వంచి

ఎరుపువారుచు పొంగు వృద్ధగౌతమి నుండి
తెలుగునేలకు నీరు మలపి మలపి
తరచైన పచ్చని వరియాకుమళ్లపై
తెర తెరల్ కెరటముల్ పరపి పరపి

పృథివిపై రాలుచున్న నేరేడుపండ్ల
నేరికొను నూడ్పుజనము పయ్యెదల నెగుర
గొట్టుచును వారితో గుసగుసలు కోడి
గములు సెలగ గోదావరిగాలి వచ్చె.

నీకు తొలికాన్పు సస్యలక్ష్మీకుమారి
అఖిలజగమును బెండ్లియిల్లై తనర్ప
అమరవరు లెల్ల కుసుమవర్షములు కురియ
ధన్యహాలిక! కన్యాప్రదాత వగుము!

అమరజీవన మీ ధాత్రి కవతరింప
ధర్మరతివై తపస్సను ధారవోసి
దివిని భూమిని రెంటి సంధింపవలయు
ఋషికులోత్తమ నీవ భగీరథుడవు!

నలుపగు మబ్బుబట్ట భువనంబుపయిన్ ముసుగున్ ఘటించి పై
జలుకు మహేంద్రజాలసువశీకృతసర్వజనాంతరంగు డి
మ్ముల నవమేఘమంత్రజలమున్ జడమా పుడమిన్ వినూతనో
జ్జ్వల బహువర్ణరూపమయప్రాణివితానము లుద్భవింపగన్

నిండె నభస్థలంబు నవనీరదకోమల నీలకాంతులన్
నిండె మహీతలంబు కమనీయలతాతరుగుల్మరాజితో
నిండు జలంబుతోడ రవణించెడు వాహినులున్ దటాకముల్
నిండుతనంబ యెల్లెడల నిండుకొనెన్ దొలివానకారునన్

పచ్చని కాల్వగట్లొరసి పారెడు నెఱ్ఱని క్రొత్తనీటిపై
నుచ్చలితంబులై దొరలుచున్న వవే చిరునవ్వు మోములం
దచ్చుపడన్ తరంగనిచయంబులు గ్రొన్నురువుల్ సెలంగగా
నచ్చటనచ్చటన్ సుడులొయారముగా తిరుగున్ ధ్వనించుచున్

అదె కను మేకమేఘముగ నాకసమందలి యర్ధభాగముం
బొదివెవినీలమై, చదల వొల్చెను భానుని మ్రింగివైచె, న
య్యదె! పెనుగాలితో గగనమంతయు మేఘములాక్రమించె నీ
యది ఋతువిప్లవంబు కనుమా! జగమంతయు మారిపోయెడిన్

గగనమున నిండియున్న గంగాభవాని
ధరణిలో డాగియున్న చైతన్యలక్ష్మి
గొండొరుల గనియు శుభముహూర్తమందు
నిను గటాక్షింతు రియ్యది నిక్కనంబు

ఆహుతి యయ్యె బూర్వాశలన్నియు బశ్చిమవాయువహ్ని వీ
చీహతి సోలుచు న్నిరవశేషముగా; నదె నీల నీరద
వ్యూహము తోడ నంబర మహో! రణరంగము లీల మారె నీ
యాహవమెల్ల నీకొఱకె యంచుధ్వనించెడి మేఘఘోషముల్

పలుకుచున్నది యాకాశవాణి యదిగో!
యాలకింపుము నీ వా రహస్యములను
గ్రాహ్యమగు నీకు నీ స్వధర్మంబు దాన
చల్లు మాపైన నమృత బీజములు భూమి

నూతనమై కనంబడు ననుక్షణముల్ వినువీధి మారుతా
నీతవిభిన్న మేఘరమణీయతరాకృతు లీ మహారసో
పేత విచిత్రనాటక మిదే గతి యెన్ని యుగాంతరంబులన్
బాతర లాడుచుండునొ యెవం డెరుగం గలడోయి కర్షకా!

అనవరత నూతనములైన హావభావ
విలసనము లెల్లెడల వెల్లివిరియు గాని
ప్రాతదన మెచ్చటను గానరాదు జగతి
గృతయుగమునుండి యేది లెక్కింపబడునొ!

లాస్య కేళీవిలాస కోలాహల మగు
ప్రకృతి నానాభిధానరూపములలోన
భావమే లేని దొకటి, నిర్జీవమైన
దొకటియును గానరాదు కదోయి మనకు

అనృత మిది యనుటయె యసత్యంబ కాదె
జడ మనుచు బల్కు టరయ మృషావచనమె
దుఃఖమయ మందు రది సహేతుకము కాదు
సచ్చిదానందలీలారసాఢ్య మిదియు !

ఎవరితీరున వా రన్వయించుకొందు
రంతియే కాని యెవ డీ యనంతసృష్టి
కావ్యమున కెల్ల నేక వాక్యంబు సేయు
నింతకును దీని పరమార్థ మేదొ! సఖుడ!

దీనినె నమ్మినావు, కృషిదీక్షయె నెమ్మది నిల్పినావు, పో
కానగరానిదానికొఱకై నడుకానల కేగబోవు; మే
లో నరపుంగవా! కృషికులోత్తమ! యెప్పటికైన నీ నిజం
బె నిను గాచు నిక్క మిది వేయివిధంబుల జాటిచెప్పెదన్

ఆ నీరదశ్యామలాకార మానంద
బాష్పకణంబుల బ్రతిఫలింప
ఆ దివ్యమేఘనినాదంబు హృత్కుహ
రాంతరంబుల బ్రతిరావము గన

ఆ రసోజ్జ్వలిత నాట్యానంద కేళికి
తను వెల్ల నుప్పాంగి తాండవింప
ఆ యనిర్వాచ్యామృతానంద మొలసి జీ
వాత్మకు రసతన్మయత్వ మొనర

నమ్మహాశక్తి కాభిముఖ్యము వహించి
యొక్క క్షణకాల మిరువుర మొక్కరముగ
దేశకాలాదిబంధముల్ తెంచివైచి
యెగిరి పోవుద మానందగగనమునకు.

అల్లిబిల్లిగ జడలల్లిన మొయిళుల
కురుల సందులను చిక్కులు వదల్చి
తరుల జొంపము వోలె దళమైన మబ్బుల
వలుద చీకటుల లోపలకు పోయి

తళుకు తళుక్కన బెళుకారు మెఱుపుల
సొలపు చూపులలోని వలపు లెఱిగి
తెలిమబ్బుగుబురల తెరలలో నురుములు
పలికించు పలుకుల తెలుగు జేసి

శిశువు గని యంత క్రొంబాలచేపు దాల్చి
యుబ్బి తొలుకాడు మాతృపయోధరముల
కరణి పొలుపారు నీ వానకారు సొగసు
విప్పి చెప్పరె! భావ సంవిదులు కవులు!

శ్యామలమూర్తి మేఘముల చాటున చక్రము ద్రిప్పుచున్న కే
శీమయ తత్త్వమే ప్రతిఫలించుచు నున్నది చూడగా ప్రజా
స్వామిక రాజ్యతంత్ర పరివర్తనలన్ వెలయించు ధాత్రిలో
నీమెయి నీలిచాయ నును నిగ్గులలోనఁ గృషీవలాగ్రణీ!

వరుసన్ బ్రాహ్మణరాజతేజములు నావైశ్యత్వముంగూడ ను
ర్వరఁ బాలించినవోయి, నీ విమల సేవాధర్మమే నేడు రా
జ్యరమం గైకొని యేలుచున్నదని పాశ్చాత్య ప్రజాపాలనా
చరితల్ చాటుచునున్న విన్నియునువిశ్వశ్రేయమున్ గూర్చుతన్

ఆశల్ పల్లవితంబులై వెలయ సంధ్యాకాల మర్కప్రభా
కైశోరస్థితి దాల్చి భూవలయమున్ గైసేసినవ్యోద్యమా
వేశస్ఫూర్తి వెలుంగ నీ హలము వేవే దోలు మీ వీయుగ
ప్రాశస్త్యం బెదలోఁ దలంచి మహిత ప్రారంభ సంరంభివై

భోగవిమోహితంబును తమోహతమై జడయంత్రబద్ధమై
నాగరకంబు పేరిట యనాగరకం బది తన్గలంప. నేఁ
డో గృహమేధి! నిన్గొలువ నున్నది లోకము, దీని కింక నీ
నాగలియే శరణ్య మగునా! తలపోయ విచిత్ర మింతయున్

సంఘంబాక్కెడ రాజకీయమగు నస్వాతంత్ర్య మింకొక్క చ
క్కం ఘోరంబుగ నిన్నమాయకపు పక్షింగూట బంధించెబో
జంఘాలత్వము సూపి యీ ప్రబలపాశవ్రాతముల్ త్రెంచి ఉ
ల్లంఘింపంగలవా పయోదములలీలం గర్షకా నీవికన్!

వ సందేహము లేల నీకు! గనుమోయీ కర్షకా! మేఘరా
జీసంచారము లే నిరోధములు గాంచెన్ జూడు మూచక్కిసం
త్రాసం బించుక లేక వీచెడు జగత్ప్రాణుండు; మేల్గాంచి స్వే
చ్ఛాసందేశము లాలకించుకొనుమీ స్వాతంత్ర్య మేపారగన్

హేయంబైన కుజీవనం బిటుల నీ వెన్నాళ్లు సాగించె ద
య్యా యార్యుండవు నిన్ను నీ నెరుగవో యా మేఘముల్ జూడుమా
ఆయానందము నా స్వతంత్రతయు నా యౌన్నత్యమూ యీ వియు
న్నా యావేశము నీకు గ్రొత్తలగునే యావంత లోనెంచినన్

నిను నీవే తెలియంగ జాలని దశానీచత్వముల్ నట్టి వ
ట్టి నికృష్టం బగు బానిసాన నిను గట్టెంగాక యిన్నాళ్లుగా
నిను నీకున్ తెలియంగ మ్రోయు ఘనసందేశంబు లాలించినన్
వనధుల్ పూడ్చు వెపర్వతంబులును బైపైవైచి యొక్కుమ్మడిన్

కా రధికారు లెవ్వరు నొకండు ప్రభుం డన లేడు నీకు నీ
వారయ సార్వభౌముడవ యాదువు నీదగు చేతిబిచ్చ మా
ధారము వీరికెల్ల వసుధారమణుండును నీకు పెద్ద పా
లే రవనిం జరించెడి నిలింపుడ వీవు తలంప గర్షకా!

రేలు బవళ్లు నాక యిటు రెక్కలు ముక్కలు గాగ జేసి యీ
నేలను సాగుచేయు మహనీయుడ వీ విటులుండ గాలిపై
గాలిడి కూరుచుండు స్వసుఖప్రియు లైన పరాన్నభుక్కు లీ
నేలకు నాధులై నిను గణింపర దేల? కృషీవలాగ్రణీ!

లలితఘనాఘనాంత సువిలాసములన్ వెలయించుచున్ రసో
జ్జ్వలము సుధాసమంబు నగు భాగవతం బిల నాడగోరి ని
ర్మలమగు కృష్ణరూప మదె రంగముపై నిను బిల్చుచుండగా
హాలధరు డైన నీవు తడయం జనదీయెడ నో కృషీవలా !

చెవి యటు లొగ్గి చిత్తమును జేర్చి వినందగునోయి కర్షకా!
ప్రవిమల సత్య సారములు భావిశుభోదయ రమ్యగీతికల్
భువన విమోహనంబులు నపూర్వరస ప్రచుర ప్రబోధముల్
నవయుగ ధర్మముల్ ఘనఘనాఘనఘుంషణ ఘోషణంబులన్

రసముల బీల్చి క్రౌర్య మది రాజ్యము నేలగ ధర్మవల్లికల్
పసిచెడి వాడ నార్యజనసంఘము డెప్పర మైన డప్పి సొ
మ్మసిలబడన్ సమస్తమును మాడ్చి వెలింగినయట్టి చెట్ట గ్రీ
ష్మసమయ మంతరించె నిక సంతస మందగదయ్య కర్షకా!

పడమటి వైపు జూడు మదె పచ్చనిచెట్లకు పై వినీలమై
యలరెడు నాకసంబున నహో! విలువంపుగ నింద్రచాప మే
ర్పడి పలువింతరంగుల ధరాస్థలిపై వెదజల్లుచున్న ది
ప్పుడమి తనంత స్వర్గమయిపోయె గనుంగొనుమోయి కర్షకా!

ఇలపయి వర్షబిందువు లివే కనుగొమ్ము విశాలశాద్వ ల
స్థలమున నాణిముత్తెముల చందము దాలిచి నీ పదాంబుజం
బుల కభిషేక మార్చెడు ప్రభుండవు నీవని కష్టజీవ నో
జ్జ్వల చరితుండ వంచు, నతిపావనమూర్తి వటంచు కర్షకా!

నింగిని దేలియాడెడు వినీలపయోదము లీవి గాంచి స
ర్వాంగము లంటివీచు మృదులానిలు స్వైరవిహార మెంచియు
త్తుంగతరంగశోభ తులదూగు నదీరవ మాలకించి చే
యంగల కార్యమందలి రహస్యము లీవు గ్రహించు కర్షకా!

మొనలు దేరిన కోటాకు కొనలు నిగుడ
వాలు వెన్నెల వరిపైరు పండబారె
రోజు కొక క్రొత్తచాయ దేరుచును నీదు
కృషికి రవల బంగారు కిరీట మమరె!

పొలములలోన పండి పడిపోయిన యీ వరిపైరు పైడి దు
వ్వలువనిగారముల్ మెరయ, పంటవలంతిపొలంతి, వింత వ
న్నె లొలయు సంజలందు శయనించెను; కల్గినవారి యింటి కో
డలివలె, తాను గాంచెడు కడానికల్ నిజమై వెలుంగగాన్

సందె కడాని డాలు నెకసక్కెము లాడగ జాలు మైసిరుల్
జిందెడు కృష్ణకాటుకల చేల గడించిన పైడితోడ నీ
కందపు గుళ్ళపే రిడుదు నంచు వచించిన బాస లెంచి నీ
సుందరి నీకునై యెదురుచూచెడు ధాన్యము జేర్చు మింటికిన్

పండుగరోజులందు కనుపండువులై తనయింట నందముల్
పండగ గుమ్మముల్ పసుపువన్నియ లీనగ ముద్దబంతి పూ
దండల మ్రోల తమ్మివిరిదండలు చూపుల గ్రాల నీదు కై
దండ గొనంగ నున్న నిజదార కటాక్షములన్ కరంగుమా!

చిందుల్ ద్రొక్కెడు ఛంగుఛంగుమని రాసింజుట్టికందోయికిన్
విందుల్ గూర్చుచు లేగదూడలవెయుద్వృత్తప్రమోదక్రియా
మందావార్యరసప్రవాహమధురోన్మాదోత్థ కల్లోలముల్
చిందుల్ ద్రొక్కు నపూర్వనర్తనకళాసీమావధుల్ దాటుచున్

పసిడి లేదమ్మితూడుల మెసవుచున్న
రాజహంసియువోలె నీ రాసికెలన
పరకల గొరుకు నీ నందివాహనంబు
పరమ సంతృప్తిలో మన బ్రతుకు నిలిచె

పండిన పంటతో కడుపుపండిన ముద్దియతోడ వేడుకల్
నిండిన యింటితో మురువు నింపెడు పిల్లలతోడ కమ్మగా
వండిన పిండివంటలను పాల్పెరుగుల్ భుజియించి హాయిగా
పండుగ రోజులన్ శ్రమమువాయ సుఖంబుల మున్గి దేలుమా!

చేతన డాగియున్న జడసృష్టికి పుట్టుపునాదియైన యీ
ధాత్రితలమందునన్ దురవగాహములై వెలిదీయరాని యా
లోతులలోని లోబారలలో వెలుగొందు హిరణ్యరూప మే
రీతిని భూమిపై వెలువరించితివోయి కృషీవలాగ్రణీ!

మలిన భూయిష్ఠ మగు నల్లమట్టి నిట్లు
స్వర్ణముగ మార్చినట్టి నీ పౌరుషంబు
చేయగాలేదె జనుల జేజేలు గాగ
మర్త్యభువి స్వర్గజగతిగా మార్చలేదె!

అంటినవోయి యీ యరుణప్రభలు మేన
నైపోయె నీకు పట్టాభిషేక
మింద్రియంబుల నావహించిన జడతయుఁ
జీఁకటు లంతంత జెదరిపోయె

పొంగారుచుండె నుత్తుంగ రంగదభంగ
భంగంబు లెగయ నీ ప్రాణశక్తి
అగునోయి నీ సకలాంగకంబులయందు
నుత్తమ జ్ఞాన సూర్యోదయంబు

నమ్ము నామాట, నిను నీవు నమ్ముకొనుము
భావియుగ శాంత పీఠుడ వీవు, శాంతి
ధర్మమయ జీవనంబు సంస్థాపనంబు
సలుపగల వీవె నా నమస్కారము లివె !




HAVE BEEN APPROVED FOR USE IN SCHOOLS
COLLEGES AND PUBLIC LIBRARIES

BY THE DIRECTOR OF PUBLIC LIBRARIES
ANDHRA PRADESH, HYDERABAD
ON SEPTEMBER 16, 1961

*Tholakari* is by Pemmaraju Lakshmipathi, a product of the Andhra Renaissance, who, to the great misfortune of the Andhra country, died recently and prematurely. He has contributed a few more poems like *Vasantam* (Spring) *Grishmam* (Summer). If he had had a longer lease of life, he would possibly have completed the cycle of the Indian seasons as Kalidasa did in Sanskrit and Thomson in English.

In *Tholakari* he describes the breaking of the south-west monsoon, bringing prosperity and happiness to the Indian peasant apostrophised as the saviour of the country in the democracy to come.

The style is fluent and melodious. It combines rapture with realism. The cloud imagery would not be unworthy of a Shelley and the country scenes of a Burns. The poet combines passion and melody without rhetoric, every stanza has a beauty and a power of its own. There is some repetition of the theme but the ordinary reader will not be aware of this, borne on by the swift poetic current.

—*The Indian P. E. N.*

This poetic composition of a little over 500 lines describes the coming down of the first rains and closes with a benediction on the tiller of the soil as the hero of peace. The cloud, the winds on the Godavari, the golden paddy and the like are all portrayed in intimate relationship with the tiller. In many places one is reminded of Shelley and Keats in their portraiture of nature. It is a superb piece of pastoral poetry.

—*The Hindu*

The Collection establishes in ample measure that *kavi* Lakshmipathi, but for his untimely demise, would have enriched the Andhra Renaissance with his sweet language and served the development of Telugu. Every verse in the collection bears the stamp of poetic talent.

In *Bali* the poet describes how the innocent son of the soil is exploited by the modern young-sophisticated landlord and is ruined by the vagaries of the weather.

*Poli* is a poor old domestic servant. The poet has earned admiration by describing the sublime ideals, hopes and aspirations welling up in the heart of Poli in the midst of her servitude.

Though *Pranayarpanam* proclaims itself an early work, it endears itself to our hearts.

*Pamulavadu* is one of the finest poems in the Collection which is characterised throughout by a fine poetic technique, bold and wide imagination and charming versification.

Shri A. Naga Gopala Rao deserves commendation for bringing the poetic work of the late Shri Lakshmipathi to the knowledge of Andhra.

—*The Indian P. E. N.*

Lakshmipathi had real poetic genius, but died at the early age of 44. As a piece of *homage* to his deceased friend, the Editor has brought out this nice Collection of the poet's works. It includes also some short story poems, lyrical pieces and pastoral poetry.

—*The Hindu.*

The volume of *Collected Poems* contains three long poems in narrative form - 'Pranayarpanam' 'Bali' and 'Poli' and a set of nine lyrical poems entitled 'Grishmam'. Grishmam is only the title piece of the lyrical section and with two other lyrics among the rest 'Sarvari' and 'Pamulavadu' belongs to the same kind as the earlier 'Vasantam' and 'Tholakari' a type of nature poetry in which the Poet reaches great heights of excellence. The spirit of the poet is so perfectly attuned to the beauty of Nature in its various seasons, aspects and moods that he is able to recreate for us the living presence and breath of it in highly imaginative verse.

Some of the lyrics are personal in theme and deal with the achievement and influence of literary and national heroes like Tikkana, Gandhi and Aravinda. Even here the style of the imagery and the accent of the utterance are highly poetic and sweep the reader off his feet on the tidal wave of the poet's intense feeling of worshipful admiration for the great men.

The narratives are characterised by restraint, concentration on the essentials and utter simplicity and directness in expression.

*Pranayarpanam* is the story of a birds' grief on the death of its partner ending in self-immolation and touching the heart and effecting a transformation in the mind of the callous and hardened debauchee who shoots it down. The theme is the power of love.

*Bali* is the story of ruthless exploitation of an ignorant peasant by his cruel and extortionate landlord, a powerful plea for economic justice.

*Poli* is the best of the lot, admirable for the vitality of the character of the heroine an old, hard-working, independent, virtuous servant-woman before whose untaught wisdom and moral stature the entire male world withers into pitiful smallness as she asserts the claim of woman for real equality in spiritual status.

Lakshmipathi's place among the greatest of the modern Telugu poets is assured and his friend Sri Naga Gopala Rao deserves the thanks of all lovers of Telugu poetry for bringing out this volume.

—*Triveni*

West Godavari is noted for its beautiful gardens and natural scenery, and late Pemmaraju Lakshmipathi who hails from the district could not escape the impression that nature had made on him. For the surging feelings of an intensely emotional character, the only outlet is poetry. And those feelings have found relief in 'Pranayarpanam', 'Bali' 'Poli' and 'Greeshmamu' and other poems collected in this volume.

*Pranayarpanam* is a powerful portrayal of human psychology in verse lucid and flowing.

*Bali* is a moving narration of the life of the poor and harassed peasant.

*Poli* seeks to analyse what is called 'Love' particulary between man and woman and ends in a note of warning to all men.

*Greeshmamu* and the rest of the collection are short poems written in easy sfrides of language.

—*The Indian Republic*

## VASANTAM *P. Lakshmipathi*

The work is divided into three parts, the first being *Vasantam* wherein fine notes of expression and finer imagery can be met with. Nature in the Spring time, in all her colourful aspects has been vividly pictured out in this little work.

*—The Modern Review*

Pemmaraju Lakshmipathi is the major contributor with a poem on *Vasanta*. His verse bears the majesty of the classics and at the same time a new farvour, grace and beauty.

*—The Hindu*

## CHELLAMAMBA *P. Lakshmipathi*

This is the story of a woman's *Sati* at Rayakuduru in Andhra-Desa in the twenties of the last century. Chellamamba was the young wife of Chengalvala Tammayya. At that time reformers and the Government were busy putting down *Sati*. In 1824 Chellamamba, inspite of the entreaties of the police, entered the pyre of her husband.

Pemmaraju Lakshmipathi, one of our younger poets, has told the stirring story of Chellamamba's devotion in verse worthy of his theme. Two drawings by Ankala Venkata Subba Rao fittingly illustrate the poem.

*—The Hindu*

భా ర తి తొ ల క రి
7 . 11 . 1943

ఇది యొక చక్కని పద్యకావ్యము. వెనుక ఒకానొకప్పుడిది భారతిలో వెలువడినదే. దానికే మరికొన్ని పద్యము లిందులో జత పడినవి,

లక్ష్మీపతి గారి కవిత్వము లక్షణ మైనది. మాధుర్యమునకు ధారా శుద్ధికిని, భావపోషణకును, అది ఆటపట్టన్నచో అతిశయోక్తి కాదు, 'వర్షాగమము-కర్షకప్రవృత్తి' ని బురస్కరించుకొని యల్లిన యీ కావ్యము పైలక్షణముల నన్నిటిని సమగ్రముగ నిండించుకొన్నది. ఈ మధురకవి యీమధ్యనే పరమపదించినాడు.

ఇదియు ఈయన రచించిన చెల్లమాంబాది ఇతరకృతులును ఈయన కవితామూర్తికి శాశ్వత స్మారకములుగా వెలయగలవని నమ్మచున్నాము.

ఆల్ ఇండియా రేడియో . మద్రాసు తొ ల క రి
26 . 1 . 1944

ఇది ఒక స్వతంత్రఖండకావ్యం, ఇందలి పద్యములన్నీ 'భారతీ' ముఖాన ఆంధ్రరసజ్ఞులు ఇంతకుపూర్వము ఖండికలుగా కాంచి ఆనందించినవే. వీనితోకూడ మరికొన్నింటినిచేర్చి ముద్దు లొలుకు ఆకారంతో 'తొలకరిని' ని ఆంధ్రలోకాని కర్పించిన ప్రకాశకులు, ప్రశంసనీయులు.

నేఁడు మన సంస్కృతిలో, మన దృక్పథంలో ఏలాంటిమార్పు గోచరిస్తుందో మన నవ్యాంధ్రసాహిత్యంలోకూడ అలాంటిమార్పే గోచరిస్తుంది. కావ్య వస్తుస్వీకరణంలోనే ఇది వ్యక్తమౌతుంది. మన నిత్య జీవితంలో మన మనుభవించే, కాంచే, దృశ్యాలు మన సాహిత్యంలో ఎప్పుడైతే ప్రతిబింబితమౌతాయో అప్పుడే మన సాహిత్యానికి గౌరవం కలుగుతుంది. ఈ 'తొలకరి' యీలాంటి సంచలనముయొక్క ఫలితమే తొలకరి లోనె వర్షాగమము అతి రమ్యంగా హృద్యంగా వుంది. ప్రాచీన వాఙ్మయంలో యీలాంటివి లేవనికాదు. అయితే వారి పంథావేరు. భారతీయులకు, అందునా ఆంధ్రులకు కర్షకుడు దైనందిన జీవితంలో సర్వత్ర ప్రత్యక్షమౌతూ వుంటాడు. అతడే మనసర్వస్వం. ఈ విషయాన్నే లక్ష్మీపతిగారు హృదయరంజకంగా, మధురంగా, వ్యక్త మొనరించారు. ఈ నవయుగంలో, ఈ శీర్షికతో బయలుదేరిన ఖండకావ్యాలు పెక్కులున్నాయి. వస్తువిషయమున వీరి కావ్యానికి ఎక్కువ సన్నిహితంగా వున్నది శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి 'కృషీవలుడు'. 'తొలకరి'లోనే మేఘోత్పత్తిక్రమము, దాని సంచారక్రమము, శ్రీ భోగరాజువారి 'కంకణము' స్ఫురింపజేస్తూ, రమ్యంగా నడుస్తున్నది. వీరి పద్యాలన్నీ రసమయములై కొన్నిభాగాల్లో జాషువాగారి ఖండికలను జ్ఞాపకం చేస్తుంటాయి.

ప్రకృతీ, విశ్వమూ, విశ్వసౌభాగ్యము, అంతా వీరికి కృషీవలుడుగానే గోచరిస్తుంది. అంచేతేకాబోలు కృషీవలుని ప్రశంసించేటప్పుడు వీరి కవితాకుమారి, మృదుభావసంపత్తీ, సుకుమార పదలాలిత్యమూ, కమనీయ గమనమూ, కలిగి ముద్దులొలుకుతూ వున్నది. ఇట్టి మనోజ్ఞ ధారాశుద్ధి కలిగి ధ్వనిమార్గంలో విహరించే వీరి నిసర్గకవితాకుమారి ఆంధ్రుల గౌరవ మునకు గురియౌతుందని భావిస్తాను.

గ్రంథవిమర్శ : శ్రీ పి. ఆర్. పి. ప్రాన్సిసు, ఎం. ఏ.

ఆల్ ఇండియా రేడియో . మద్రాసు ఖండకావ్య సంపుటి
29 . 5 . 1949

సహృదయుల మన్ననలపొందిన లక్ష్మీపతిగారి 'వసంతాది' ఖండకావ్యములు ఆంధ్రలోకానికి సుపరిచితములైనవే. బహు పండిత ప్రశంసలకు గురియైన 'తొలకరిని' ఆల్ ఇండియా రేడియో మద్రాసు కేంద్రమునుండి ఆంధ్రలోకానికి పరిచయం చేశాను. ఒకమాటు. ప్రస్తుతం 'ప్రణయార్పణము . బలి . హోలి . గ్రీష్మాది' ఖండకావ్య సంపుటిని విమర్శించే అవకాశం కలిగి నందుకు ఆనందిస్తున్నాను.

సంపాదకుడు రచయితహృదయ మెరిగినకవి. సహృదయుడు కూడాను. కవి సంపాదకహృదయ మెరిగిన సరసుడు. అందు చేతనే ఈ ఖండికలు మనోజ్ఞమైన ఆకారంతో, రసజ్ఞులామోదించే క్రమసంపుటీకరణరూపంతో లక్ష్మీపతి స్మారకసంచికగా వెలుగు చూశాయి. ఇందలి 'అశ్రుతర్పణము' సంపాదకుల సహృదయ త్వాన్నీ, సాహితీహృదయాన్నీ నిర్మలప్రేమ తత్త్వాన్నీ, వేనోళ్ల ప్రకటిస్తుంది.

ఈ ఖండకావ్యసంపుటి నవ్యకవితాప్రపంచమున గౌరవస్థానాన్ని పొందుతుంది. ఇందలి ఖండికలన్నీ స్వయంసంపూర్ణము లైన రసవత్తరఖండ కావ్యాలు. నవ్యాంధ్రసాహిత్యంలో మానవదైనం దిన జీవితం వ్యంగ్యమార్గాలో ప్రతిబింబిత మౌతుంది. ప్రపంచా తీతమైన వస్తువర్ణనము కంటె మన అనుభూతిలోవున్న వస్తువర్ణ నమే హృద్యంగా వుంటుంది. పూర్వం కావ్యలోకాన మృగ్యమైన సామాన్యజీవితం ఈనాటి మన వాఙ్మయమున ప్రశస్తకావ్యవస్తు వుగా పరిణమిస్తుంది. భారతీయదృక్పథంలోవున్న భేదభావాలంత రించి సమదృష్టిభావోదయం కలుగుతుందని నేటి మన కావ్యసృష్టి

నిర్ధారిస్తున్నది. ఈ మార్పులు మన సాహిత్యానికి వన్నె తెచ్చాయి ఈ విశిష్టగుణములే లక్ష్మీపతిగారి ఖండకావ్యసంపుటికి శోభ కలిగిస్తున్నాయి.

కేవలం పదాడంబరమే కవిత్వమని భ్రమించిన దినాలున్నాయి. శబ్దాడంబరమే ప్రధానంగా వెలువడినరచనల్లో కవితాభావంకంటె ఛాందసత్వం అధికంగా వుంటుందేమో! క్షీణయుగంలో వెలువడిన ప్రబంధరచనలో ఛందోలంకార శబ్దాడంబరవ్యాయామమున కున్నంత ప్రాధాన్యం కవిత్వాని కున్నట్లు కనబడదు. అట్లని వ్యుత్పత్తి కవితా వికాసానికి అవసరంకాదని కాదు. ప్రతిభావ్యుత్పత్తులు రెండూ ప్రధానాలే అని. అంతేకాదు. ఒకవేళ వ్యుత్పత్తి లోపించినా ప్రతిభ ఆ లోటును కప్పివేస్తుందనీ భావం. వస్త్వైక్యమూ, భావప్రాధాన్యమూ, రసవత్తతా, వస్తుసదృశమైన రచనారీతి స్వభావోక్తిమంతమైన ప్రకృతివర్ణనలు, వర్ణ్యవస్తుసాక్షాత్కారమూ కావ్యసృష్టికి ప్రధానముకానీ, కేవలసమయసిద్ధములైన ప్రబంధపణితులు కావు.

మానవ జీవితంలో వున్న సామాన్యసన్నివేశాన్ని స్వీకరించి రసవత్కావ్యసృష్టి కావించడంలో లక్ష్మీపతి గారిది అందెవేసిన చేయి. 'ప్రణయార్పణము' నందలి పక్షియుగ ప్రణయైక్యమూ, భూస్వామి క్రౌర్యకాఠిన్యరాక్షసత్వాలకు 'బలి' యైన పేదరైతు దయనీయవృత్తాంతమూ, కులహీన అహీనగుణయాటేగాక తన అసమాన సౌశీల్యసంపత్తిచే భారత క్షోణికంతా, ఆశ్రితధర్మాన్నీ దాంపత్యశుచిత్వాన్నీ ప్రబోధింపజాలినంత శక్తిసంపన్నగావచ్చునన్న 'బోలి' వృత్తాంతమూ చాటుచున్నవి, అంతేగాక పూజనీయ స్థానంలో గర్హ్యవస్తువూ, గర్హ్యస్థానములో పూజ్యవస్తువూ ఉత్పన్నమై ఉజ్జ్వలితం కావచ్చు నన్న సత్యం ఈ కావ్యాల్లో రసాత్మకంగా సర్వత్రా గోచరిస్తుంది, కరుణరసప్రధానము లైన ఈ కావ్యత్రయము నవ్యాంధ్ర సాహిత్యానికి శోభావహంగా వుంటాయి,

